# అగ్నిధార

[ ఖండకావ్యము ]

" దాశరథి "

విరోధి

శ్రావణం

సర్వస్వామ్యములు
గ్రంథకర్తవి.

# సాహితీమేఖల

౧

రూపాయిన్నర

## సాహితీ మేఖల

# సంపాదకీయము



మా "సాహితీమేఖల" తెలంగాణమందు ఒక పుష్కరమునుండి ఆంధ్రభాషా సేవకు నియమై అలరారుతున్నది. విఖ్యాత సాహితీపరులు కవిరత్న శ్రీ అంబటిపూడి వెంకటరత్నంగారి ఉత్తమకావ్యములను, నాటకములను, ప్రచురించి తెలంగాణమున నూతన ప్రభాతకాంతులు విరజిమ్మినది సాహితీమేఖల. 'మైనాదేవి' 'ప్రణయావాహిని' 'వత్సలుడు' 'దక్షిణ' మా ప్రచురణలే. కవితాతపస్వులరచనలను ప్రచురించుటయేకాక వారిని సన్మానించుట, వారి మహాతపస్య నిర్విఘ్నముగా కొనసాగుటకు వలయు సహాకారమును నెరపుటయందు ప్రధానాసక్తి చూపినది సాహిత్యమేఖల. దీనికి తార్కాణముగా శ్రీ దాశరథిని పదిసంవత్సరాలక్రితం ప్రప్రథమముగా సన్మానించి ప్రోత్సహించటము జరిగినది.

ఈమాటు శ్రీ దాశరథి ఖండకావ్యరచనలను ప్రప్రథమమున సంపుటీకరించి—అగ్నిధార—ప్రకటించి అభినవ్య భవ్య రుచులను ఆంధ్రలోకానికి అందించుతున్నాం. సాహితీమేఖల సర్వదా తన చిరుగంటల ఘలంఘలలతో ఆంధ్రసాహితీరంగమును మంగళనినాద పరిశోభితం చేయగలదు.

ఆంధ్రరసికులు మా ఈ ప్రచురణను అందుకొని హర్షించగలరని ఆశిస్తున్నాం.

అగ్నిధారలో క్రోడీకరించిన ఖండికలను, మాతృభూమి, ప్రజామిత్ర, గోలకొండ, సారధి, అభ్యుదయ, విశాలాంధ్ర మొదలైన పత్రికలనుండి సేకరించినాము. కావున ఆపత్రికలకు మా కృతజ్ఞత.

ఈపుస్తకమునకు కోరినంతనే పీఠిక వ్రాసియిచ్చిన మిత్రులకు ప్రచురణకు తోడ్పడిన మిత్రులకు ధన్యవాదాలు.

ఇట్లు భాషాసేవకుడు,

వ్యవహర్త.



# తొలిపలుకు

—:o:—

అగ్నిధార యను గ్రంథనామకరణకు యీ ఖండకావ్యసంపుటి యొక్క ప్రత్యేకతను రచయిత వ్యక్తిత్వమును సూచించు చున్నది. గ్రంథకర్త శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు. తెలంగాణ యువకవులలో అగ్రగణ్యుడు. ఆయన హృదయమును కుమలపెట్టిన పొగలు, సెగలు పైకి ఉబికివచ్చి యీ గ్రంథములో అక్షరరూపము దాల్చినవి.

ఆధునికయుగము తెలుగుసాహిత్యములో అభ్యుదయయుగమని చెప్పవచ్చును. భావకవిత ఇంచుమించుగా ఆధునిక తెలుగు సాహిత్యమునుండి నిష్క్రమించిన గోదావరీనదీవాః పూరముగాని, కృష్ణా తరంగపంక్తులుగాని అభ్యుదయకవిత్వములో గానుపించవు. ప్రేయసినిగూర్చిన ప్రేమగీతాలు ఆధునిక కవులను ఆకర్షించుటలేదు. గులాబిగుత్తులు, పన్నీటిజల్లులు, వలపుతలపులు, వెన్నెలవిహారాలు, తూగుటుయ్యాలలు నేటి కవితావీధులలో కానరావు. "ఏజాతిచరిత్ర జూచినా, ఏమున్నది గర్వకారణం ; నరజాతిచరిత్రమంతా పరపీడనపరాయణత్వం" అని పలికిన శ్రీ శ్రీ తెలుగుకవిత్వములో ఒక క్రొత్త మార్గము త్రొక్కినారు. ఈ సాంప్రదాయము ననుసరించి కవిత్వమువ్రాయు యువకులలో శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు ప్రముఖులు. ఆగర్భశ్రీనాథునికి, అనాథునికి మధ్య చిరకాలము నుండి జరుగుచున్న సంఘర్షణయే మా దాశరథి కవితావస్తువు.

తెలుగుసాహిత్యములో ఇదియొక విప్లవాత్మకమగు మార్పు. ఈమార్పునకు మన ఆర్థిక సాంఘిక పరిస్థితులే కారణమని చెప్పవచ్చును. నేడు మనదేశములో ఆర్థికముగా ఒక గొప్ప విపవము జరుగుచున్నది. రాజరికము, పెట్టుబడివిధానములమీద ఒక పెద్దతిరుగుబాటు జరుగుచున్నది. సాహిత్యములోగూడ యిట్టి తిరుగుబాటే గనపడుచున్నది. ఈ తిరుగుబాటుకు దాశరథి కవిత్వము ఉత్కృష్టనిదర్శనము.

తెలంగాణము నాజన్మభూమి యని దాశరథి గర్వించును. "నా తెలంగాణ కోటిరత్నాల వీణ" అని యన్నాడు. శ్రీ గురుజాడ అప్పారావు "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అనిచెప్పినారు. ఆదేవిధముగా దాశరథి తెలంగాణము రైతుదే అనిఢంకాకొట్టి వచించినారు. తెలంగాణరైతు కష్టసుఖములే దాశరథి కవితాసామగ్రి.

దున్నినవానిదే భూమి యను సిద్ధాంతము యీనాడు సర్వదా అంగీకరింపబడుచున్నది. ఈసిద్ధాంతమునే దాశరథికవిత్వము కూడ ప్రతిపాదించుచున్నది. నిలువనీడలేని, నిస్వార్థనీచమానవుని అభ్యుదయమే దాశరథికవిత్వమునకు ఆదర్శము, ప్రేరణ, పజ్జబువ్వకోసరమై లజ్జవిడిచి చిరిగినచీరలతో ముజ్జగాలు తిరిగే వేసల ఎంగిలిమెతుకులు దొంగిలించి "బంగారం పొంగించిన ధనికులను మ్రింగాలని దొంగచాటుగా కాలము తొంగిచూచినది" అని దాశరథి హెచ్చరిక. 'నీపిల్లలను ఇల్లాలిని కిల్లీమాదిరిగా నమిలే మిల్లుమ్యాగ్నెట్లు, నీవేడినెత్తురులో షవర్ బాత్ తీసు

కొనే భువనైకప్రభువులు, ఆధిక్యతను ఉంచగూడ'దని దాశరథి కార్మికులను ప్రేరేపించుచున్నారు. కావుననే యీయన వ్రాతలు నరాలకు అగ్గిపెట్టి, మెదడుకు ఉడుకు లెక్కించుచున్నవి. ''పీడితప్రజావాణికి మైక్ అమర్చి అభివాదులకున్ వినిపింపజేసెదన్''అని యీయన గొంతెత్తి పలుకుచున్నారు. బ్రతుకువిలువలు నశించి పాడుపడిన యీస్వార్థప్రపంచములో విప్లవాగ్నుల తుఫానును లేపుచున్నది నిజముగా యీయన కవిత్వము.

గతసంవత్సరము తెలంగాణమంతయును కుంపటిలోపడి నిప్పులలో మాడిపోయినదని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. ఆనాటి ప్రజలకష్టాలు దాశరథిని కాలరుద్రునిజేసెను. కావుననే ''వ్రణాలకు, రణాలకు, మరణాలకు, మానవప్రాణహరణాలకు, హద్దూపద్దూ వుండని కరకుతురక రాజ్యములో చిరభేదం విరమించిన బ్రతకమా! కడుపునిండ గంజినీళ్ళు గతుకమా!''అని ఆయన దీర్ఘనిశ్వాసము విడిచినారు. నిజానికి ఆ దినాలు అట్టివి. ఆ గండమునుండి యెట్లు బ్రతికి బయటపడినామాయని కడు ఆశ్చర్యము కలుగుచున్నది. అన్నార్తులు, అనాథలు ఉండని నవయుగానికి, కరువులేని కాలమునకు ఎదురు చూచుచున్నాడు దాశరథి.

తెలంగాణలో జరిగిన ఆస్తులదోపిడులు, పడతులమానాల అపహరణము, ఊళ్ళకుఊళ్ళు అగ్గిపెట్టి, తల్లిపిల్లలకడుపు కొట్టిన దుర్మార్గము మున్నగుసంఘటనలు దాశరథి హృదయములో

నిప్పుకణికలను వెదజల్లినవి. తత్ఫలితముగా చెలరేగిన ధూమ జ్వాలలు తెలంగాణ సమర సాహిత్యముగా పరిణమించినవి. జగత్తంతా రగుల్కొన్న క్రోధజ్వాల ఆరకపోదని, ఆదుర్మార్గాలకు కారకులైనవారిని దాశరథికవివాణి శపించినది.

నేడు తెలంగాణాలో కవులెందరో యున్నారు. కాని పీడిత ప్రజలసమస్యలకు ప్రాధాన్యతనిచ్చి, గొంతెత్తి చెప్పగలిగిన కవివాణిదాశరథియే. జనసామాన్యము యొక్క హృదయాలలోని ఆకాంక్షలను గట్టిగా, శక్తివంతముగా వ్యక్తీకరించిన ఆంధ్రావని యువకుడు మరొక్కడు లేడనిచెప్పిన అతిశయోక్తి కాజాలదు. దౌర్జన్యము, అన్యాయము, అక్రమములమీద తిరుగుబాటే ఒకమాటలో దాశరథికవిత్వము.

దాశరథికి ఉజ్వలమగు సారస్వతభవిష్యత్తు గలదు. భగవంతుడు ఆయనకు దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించుగాక !

హైద్రాబాదు
15—8—49

దేవులపల్లి రామానుజరావు

ఓ
జనతా
నతాంజలి పుటోజ్జ్వల
కోష్ణ నవోష్ణ రక్తధారా జలసిక్త
పాద కమల ద్వయ శోభి మనోజ్ఞ దేహ రేఖా
జయభారతీ !

యుగ యుగమ్ముల పున్నెపుపంట వీవు
నీ పూజకు తెచ్చినాడ నిదె
పొంగిన గుండియ నిండు పద్దెముల్.

జండా ఒక్కటె మూడు వన్నెలది ;
దేశంబొక్కటే భారతాఖండాసేతు హిమాచలోర్వర;
కవిత్వాండమ్ములోనన్ రవీంద్రుండొక్కండె కవీంద్రుడు ;
ఊర్జిత జగద్యుద్ధాలలో శాంతికోదండోద్యద్విజయుండు
గాంధి ఒకడే, తల్లీ ! మహాభారతీ !

# ధర్మచక్రము

నాడు కళింగసంగరము
నం దొక లక్షగళాల నెత్రు ప
రాడిన జూడజాలక ధ
రాతలి శాంతి సుధాప్రవాహ మ
ౖరాడుటకోసమై బ్రతుకు
నంజలి పట్టిన మా అశోక స
మ్రా డురుధర్మచక్రము పు
రా ప్రతిభా పరిణద్ధ మయ్యెడిన్.

# రైతుదే!

ప్రాణము లొడ్డి ఘోర గహ
నాటవులన్ బడగొట్టి మంచి మా
గాణములన్ సృజించి ఎము
కల్ నుసిజేసి పొలాలు దున్ని భో
షాణములన్ నవాబునకు
స్వర్ణము నింపిన రైతుదే, తెలం
గాణము రైతుదే ; ముసలి
నక్కకు రాచరికంబు దక్కునే ?

ఓ నిజాము పిశాచమా ! కానరాడు
నిన్నుబోలిన రాజు మా కెన్నడేని ;
తీగెలను తెంపి, అగ్నిలో దింపినావు
నా తెలంగాణ, కోటి రత్నాలవీణ.

# ఉష

రక్తిల లోచనమ్ములు క
ళారసధారల పారణమ్ములో
వ్యక్తము లయ్యె నా నుదుటి
యందున కెంపులు దేరి, నిశ్చలా
వ్యక్త సమాధిలోన కల
మంది నిషా విష మెక్కిరాగ నా
రక్తములో ఉషా కరత
లమ్ములలో కవనమ్ము లల్లెదన్.

అదిగో ! ఉషాకుమారి, దర
హాసముతో ఉదయాంగణంపు సం
పదలను కుంకుమాంజలులు
పట్టుటకై జలతారుచీరెలో

కదలెడు కౌనుతో తెలుఁగు
గడ్డకు వెల్గులుఁబోయుచున్న, దు
న్మద గజరాజయాన, మధు
మాస విలాస వికాస భాసయై.

తెలతెల వారు జాముననె
తీర్చితి నా కవితాంజనమ్ము నా
కలములలోన : ఈ కరడు
గట్టిన గుండెల రక్తవాహినుల్
జలజల జార కుచ్చిళులు
జార్చెడి ఔషసరాగకన్య ఉ
జ్జ్వల మధురాధరోష్ఠమున
జల్లెన నా కవితామృతాంబువుల్.

# ఆమని

ఆమని ప్రొద్దుటన్ మలయ
మండలి చందన గంధవాహముల్
నా మునివాకిటన్ బడి స
లాములతోడ కవాతు జేసి, ఆ
మ్రీ ముకుళాలలోల విర
మించిన పౌష సనాట్యముల్; నిరా
శా మృతజీవులార ! మధు
శాలికలో చషకమ్ము నెత్తుడా !

బ్రతుకులు దీర్ఘ రాత్రముల
భాతి చలింప విషాద దంష్ట్రిలన్
చితికి, విశాలమా ప్రకృతి
నింపిన సంపద లెల్ల పీడి, దు
గ్గతికయి కుందు మానవుల
కై కవితా మదిరాను పానమే
అతులిత మోహనౌషధము ;
ఆమనిలో చషకమ్ము నెత్తుడా !

అదిగో ! వసంతరాజు, పువు
టమ్మలతో మరు డేగుదెంచగా
మృదుల రసాల కౌసుమ స
మాకృత నూతన వాసనా మహో
నదుల సవాగతుం డయియె :
నా ప్రియురాలి నవాధరోష్టమం
దెదియొ రసిచ్ఛదమ్ము కను
పించె సురా చషకమ్ము నా కొనో !

నా ప్రియురాలు నందనవ
నమ్ముల పూవుల అంట్లు తెచ్చి నా
కప్రపుతోటలో మడులు
కట్టిన ; దా కుసుమాల మాలలో
అప్రతిమాన కింపురుష
హాసములే కనుపించునంట ! ప్రే
మప్రసవాలు, మానస సు
మాలు, ప్రియా దరహాస సూనముల్.

# ఉగాది

రిక్కలు రాలిపోవ విద
ళించు ఉషో గగనాంగ భాగమ
ట్లొక్కొకమారు కొప్పుపువు
లొల్కగ తళ్కులపైట జార్చుచున్
చక్కనిలేమ యొక్కతె ని
షా గొని వేపపువుం బ్రసాదముల్
మెక్కు మటంచు పంచినది
మెక్కితి చక్కదనంపు తీపిలో.

అవును, ఉగాది వచ్చు సమ
యంబున వెచ్చని వేపపూల మా
ధవు డరుదెంచినాడు, బహు
ధా పరిరమ్య వసంత శాంత సాం
ధ్య్ర వికచ మల్లికా మధుర
హాస విలాస వికాస భావసం
భవ నవ నవ్య భవ్యగరి
మా నత నూతన వర్షరాజుగా.

అవును, ఉగాది వచ్చె, పది
యారుకళ్ళల్ సళియించిపోయి న
ల్లవడిన చంద్రికాగృహము
లన్ కళదేరెను, దారి తప్పి వె
ల్లవిసిన బాటసారి రస
నాగ్రమునందు మధూకమాలికా
స్రవ మధు విప్రుషమ్ములు వి
రాజిలె తాపము నింక పెంచగా.

వేప పూత చేత ఊపిరాడని గుడ
మధుర ధార తిక్తమై చెలంగె;
చింతగుజ్జులోన చిక్కిన పసిమావి
పిందె లందు వగరు మందగించె.

ఈ ఉషఃకన్య కన్నులలో అమోఘ
నవ్య వాసంత కాంతులు నాటుకొనియె;
పాతకాలము పోయెను, లేతకాల
మరుగుదెంచె 'విరోధి' నామాంతరమున.

# రుధిరసంధ్య

పూచిన మోదుగుంబువుల
పుక్కిటినుండి వసంతరాజు ర
క్తాచమనంబుసేయు సమ
యం బిది ; సాంధ్యపరాగరాగ గో
రోచన కాంతిపుంజిత వి
రోచన లోచన రోచిరుజ్జ్వలం
బై, చరమాచలాగ్రశిఖ
రాంతర దంతురమై చెలంగెడిన్.

ధుమధుమ లాడసాగినవి
తూరుపుదారుల మోదుగుం బువుల్
బొమ ముడివెట్టి యాడినవి
పొన్నలు గన్నెరు కన్నె మొక్కలున్ ;
ఘుమఘుమ లాడిపోయినది
కుంకుమ పూజవరాలు : మాధవీ
ప్రమద యొయారియై నదికి
పక్కగ మావిని కౌగలించెడిన్.

వెచ్చని కంటినీటి నికీ
పించెద నా కలమందునుండి ; క్రొ
వ్విచ్చిన మావిపూలు గురి
వెట్టి అనంగుడు పొంగికొట్టి ; గ్రో
ర్వెచ్చని పారిజాతములు
విచ్చెను యౌవనసీమలందు : నా
బిచ్చపుగుండె ప్రేయసిని
వేడును కౌగిలిభిక్ష పెట్టగా.

* *
*

అగ్నిజ్వాలిక పోలిక
నగ్నముగా నాట్యమాడు నవవాసంతో
ద్విగ్న పలాశప్రసవా
లగ్న జపాలక్తరక్తరమ కనుపించెన్.

* *
*

# జ్వాలాతోరణము

జ్వాలాతోరణమాల కొండసిగపై
బంధించినా రెవ్వరో
బాలా! మాధవమాస వాసరములన్
ప్రత్యగ్రమాధ్వీక పు
ష్పాలన్ బంభర కంబుకంధరలు త
ప్పన్ ద్రావి నిద్రింపగా
కాలజ్వాలలు చుట్టుముట్టినవి సౌ
ఖ్యశ్రీ ధ్వంసకాగ్న్యౌఘముల్.

# యెండలు

తన నీడలో తానె కునికిపాటులు పడు
ఇర్రి గుండెలయెండ లెర్రనయ్యె
పచ్చ పచ్చని ఆకు బ్రతుకు చూడగలేక
మర్రిపండులకన్ను లెర్రనయ్యె
పైనుండి 'వారి' రాబడిలేక సెలకన్న
చిక్కుచు శల్యావశిష్టమయ్యె
కౌగింటి వేడిలో క్రాగిన మేనికి
శీతోపచార మాశ్లేష మయ్యె

నిప్పుపూవుల మోదుగు కొప్పులోన
అడవిజడ యెల్ల ముడివడి అడగియుండె
ఎండిపోయిన వాగుల నిండిపోయె
నెండమావులు గ్రీష్మంపు టెండలందు.

చలిచలి పోయి గాడుపులు
సాగిన వేడుపుతోడ వేడి యూ
ర్పులను వెళార్చుచున్ : గహన
ముల్ దహనమ్ముల బిల్వసాగె మా

పులు కుసుమింపసాగె, వల
పుల్ ప్రసవింపగసాగె డొక్క- 'లా
కలి, కలి, అంబలీ' అనుచు
క్రమ్మర కేకలు వేయసాగెడిన్.

శీత వాత క్రకచముల కోతపడిన
నా నరాల కగ్గిని పెట్టు బూనినాడు
పాడు ఎండకాలపు దండగీడు : నన్ను
పాడుకోనీడు పూవ్వుల జాడలందు.

శీత మేగగానె చిచ్చు లేతెంచును
చిచ్చు లేగినంత చెట్టు మిట్ట
గట్టు పుట్ట కలిపి కొట్టెడి జడివాన
లరుగుదెంచు ; గుండియలు ద్రవించు.

ఏమిటో ఈ జగత్తు ! సహింపరాని
షడృతు గణ మిది : జీవిత స్వర్గ మెల్ల
నరకమైన విషాద మానవుడు వీడు :
నరపతుల కెల్ల ఘోర దానవుడు వీడు.

# జైల్లో!

ఇది నిదాఘము : ఇందు సహింపరాని
వేడి యేడ్పించుచున్నది : పాడువడిన
గోడలందున జైలులో పాడినాడ
వాడిపోనున్న పూ మొగ్గపైని పాట.

మండు టెండల క్రాగిన గుండె నెత్రు
బండ వారిన మనసులో నుండి జారి
పచ్చ పచ్చని పూ మొగ్గపై నటించి
ఎర్రవార్చిన దీగ్రీష్మ మేడిపింప.

చల్ల చల్లని వాగులన్ చిల్లుచున్న
తుంపురుల గుంపులోన కాలంపు కన్నె
స్నాన మాడినదో ! రసోద్యానవాటి
వలువ విచ్చుక నృత్యాలు సలిపె నేమొ

ఈ యెండకాలమ్ములో యెన్ని వర్షాలు
దాగియున్నవో ! చూడసాగినాను ;
ఆ యెడారి పొలాలలో యెన్ని గంగలు
పొంగునో ! యని చూడబోయినాను ;
ఆయాసపడు జైలులో యెన్ని ప్రజల రా
జ్యము లున్నవో ! యని యరసినాను ;
నిరుపేదవాని నెత్తురు చుక్కలో నెన్ని
విప్లవాలో ! యని వెదకినాను ;

నీళ్ళలో నిప్పుమాదిరి నిప్పులోన
నీళ్ళమాదిరి, కష్టాల నీడలందు
సుఖము నివసించునంట ! ఉస్సు రను వేడి
ఊర్పులోన పరీమళా లున్న వంట !

ఈ కాలానల కీలికా వితతిలో
ఏ యిల్లు ! యే వూరు ! యే
లోకం బాగును ! ఎంద రెందరు దరి
ద్రులై చచ్చిరో ! ఏ సతీ

శోకం బాకస మంటుచున్నదో ! సుతుల్
చుట్టాలు చల్లారిరో ?
నాకున్ నీకు గణింప శక్యమె? దురం
తక్రాంతి కాలార్భటుల్.

ఇట వసంతము లేదు, సహింపరాని
గ్రీష్మ హేమంత కాల కాళికలె గాని ;
ఇట ఉషస్సులు లేవు ; భరింపరాని
అంబువాహ సందోహ నిశాళి కాని.

వెన్నెలలు లేవు, పున్నమకన్నె లేదు,
పైడి వన్నెల నెలవంక జాడ లేదు,
చుక్కలే లేవు, ఆకాశ శోకవీధి
ధూమధామమ్ము, దుఃఖ సంగ్రామభూమి.

కాల దైవజ్ఞు డీ జగత్కన్య హస్త
తలము దర్శించి జ్యోతిషమ్ములు వచించు
"పరుల హింసించువారలు బాగుపడెదు
మాట వట్టిది, నాశన మ్మాట నిజము."

# ఋతుషట్కము

బాకా లూది పికాధిరాజు దెసలన్
పల్కించె; మాఱ్ఱోమ్రితలన్
చీకాకై శుక శారికా గణము వి
చ్చేసన్ నోళ్ళు సీళ్ళించు; నా
ళీక శ్రీక సరస్తటమ్ముల రసా
లీ పాక ధారా రసం
బా కంఠమ్మగ ద్రావ రాగదవె బా
లా! ఆమ్రి పాకస్తనీ!

*

తాపము నోపజాలను మ
దప్రమదా! అదిగో! రసాలవున్
తోపుల కాపు లుందము; న
దుల్ కలయాడెడి సంగమాలలో

(౧౮)

ఆగ్ని ధార

మాపులు దాటవేతము , గ్రీ
ష్మమ్మగ ఊష్మము గ్రీష్మ మేగగా
రేపు పయోద వాదములు
రేగును సాగును శీతవాతముల్,

*

వానలలోన, క్రొంజలువ
వాగులలో వడగళ్ళలో పసం
దైన పయంటయున్ పిరుదు
నంటిన చీరెయు నాని పోవ రా
వే ననకన్నె ! కొంకున చ
లించెను నీ తనువల్లి యెల్ల, శీ
తానిలధారలో వలువ
లారగ గట్టుము నా బుజాలపై.

*

చుక్కలు దాటి చెంగలువ
సుందరి నొక్కగ చక్క వచ్చినా
డక్కముదా మనోహరుడు,
అచ్చపు వెన్నెల గిన్నెలందునన్
చిక్కనితేన పోసికొని
చిన్నని పొన్నని కన్నెవాగులం
దొక్కొక పాద మూని నడ
లొత్తును చేపలు మ్రింగునో యనన్.

*

చలిచలి, చాలి, చాలని 'ర
జాయిని. కప్పుక కన్ను మూసి ని
ద్రిలు వడబోసి స్వప్నములు
త్రావి ప్రియాక్షర మారగించి ఆ

కలి దిగఁబట్టి వత్తును ; జ
గత్తును మొత్తము 'మొత్త' కిందనే
నలిపి 'చలీ చలీ' యనుచు
నాలుక దప్పి గొంసన్ జపించనా ?

*

ఆకులు రాలిపోయె, దెస
లన్నిట* చీరెలు జారిపోయె ; న
గ్నీకృతమై మహాప్రకృతి
నేలకు మోమును వాల్చె ; దుష్టవా
తాకులమై శరీరము, హృ
దంతర మంతయు బీట లెత్తె ; బా
లా ! కటి శోకముల్లు విడ
లాగిద శైశిర కాల ధర్మగా.

*

# వాసంతిక

ఓ వాసంత కుమారి ! నీ పెదవులం
దూరెన్ మరందాంబు ధా
రా వాఃపూరము ; తావినాడ పుడిసి
ళ్ళన్, చెంబులన్, బిందెలన్;
రావే, నా హృదయంపు సైకత ధరా
రంగాన పొంగారి శో
భా వాల్లభ్యము నగ్గలింపుము ; మధు
ప్రాభాతిక స్వామినీ !

నీ నును బుగ్గలందు రమ
ణీ ! అరుణారుణ బాలభానుడే
లా నటనార్థియై ఉదయ
రాగముఁసన్ పరువెత్తి వచ్చె ? వ

([illegible]) అగ్నిధార

స్థానిత తీక్ష్ణతన్ మధుర
తాండవ మాడను ? నా కలంపు వి
న్నాణముతో రచింతు లలి
నా ! నును చెక్కులపైని కావ్యముల్ ;

పచ్చని చెట్టుక్రింద తెల
వారక ముం దొకనాడు నీవు నేన్
వచ్చితి మొక్కమారుగ ; భ
వత్సుకుమార కరాంగుళీయకం
బిచ్చితి, నాదు వ్రేలునకు
పెట్టితి వెన్నడు నన్ను వీడకో
వెచ్చనివాడ ! యంచు శల
విచ్చితి వో మధు మాధుకన్యకా !

# వసంతకుమారి రాక

నా వాసంత కుమారి వచ్చినది వీ
ణా వాదనానంద సం
ధ్యా వీచీ పరిజల్పిత స్తన కటీ
నాభి ప్రదేశాలతో :
నా వాసంత కుమారి విచ్చినది పు
న్నాగ ప్రసూనాంబర
శ్రీ విన్యాసముతోడ నా కొరకు కాం
చీ కింకిణీ నాదమై.

కంకణ కింకిణీ చకచ
క ప్రణిన్నాదముతోడ వచ్చి నా
వంక నెదిర్చి చూచినది,
పంకజపాణి దృగంచలాన సా
యం కమలాలయ ప్రసవ
హాస విలాసము కానుపించె ; సా
లంకృత కన్యవోలె రతి
రాజకుమారిక వోలె చూపడెన్.

ఆయమ నా హృదంతర వి
హాయస వీధుల కప్పుకొన్న జ్యో
త్స్నయ శశాంకమో ? దశది
శీ విశదోజ్జ్వల సుప్రభాత దే
శీయ మనోజ్ఞరాగ రవి
సింధుర బంధురకాంతి బింబమో ?
ఏ ఉపమానమున్ తొలక
రింపదు నా హృదయోర్వరాతలిన్.

* *
*

అట నివసింతమా ! సఖి, న
వారుణ వల్లవికా రసాల ని
ష్కుటముల గూడు కట్టికొని
కోయిల కూయిలుచోట, కోటి సం
కటములు మాటుపెట్టి వడ
గాడ్పుల యేడ్పులు దాటి శీతలో
త్కట జలపాత తీరముల
కాలము వేలము వేసికొందమా ?

# వానలు

భగ్గున మండు గ్రీష్మ ఋతు
వాసర తాపము లోకమారుగా
తగ్గెను ; వాన గాడుపులు
తాకెను, సోకెను సన్నజాజి పూ
మొగ్గలపై తుషారములు ;
పొంగిన బంగరు చన్నుదోయితో
డిగ్గె విహాయసమ్మును త
టిన్నటి నన్ వరియించుకోసమై.

మామిడి పూచి పోయినది
మాధవుడే ఆరుదెంచి పోయె, 'కూ,
కూ' మధుకోకిలా, ప్రణయ
కూజితముల్ వినిపించకుండె ; ఆ

ఆమని శోభలే వరద

లై పరువెత్తెను వానలోన : బా

లా ! ముకుళాయమాన వసు

ధమ్ములలో మకరంద మెత్తుమా !

జలదాదేశిత వర్షధారలు ప్రవే

శం బయ్యె విశ్వంభరా

తలి ; శంపాలతికావితానములు రా

ద్ధాంతమ్ముగా వజ్రదం

డ లయాఘాత జయప్రదర్శనము స

ల్పన్ జొచ్చె ; ఆకాశ వీ

ధులలో కొండలు దేరి పోయినవి యా

దోనాధ గర్భంబువుల్.

గుటగుట త్రాగివేసె చిను
కల్ భువి క్రక్కిన వేడి నెల్ల ; ఆ
రటపడి మ్రొగ్గిపోవు ఉద
రమ్ములు చల్లవడెన్ ; తటిన్నటీ
కటక రటత్ సువర్ణ జయ
ఘంటలు కింకిణికా ఝుళంఝుళో
త్కటమయి వీను సోకె వడ
గళ్లు పటాపట నేల రాలగన్.

# చంద్రోదయం

వచ్చినవాడు చంద్రముడు
పాలసముద్రపు మూలనుండి గో
ర్వెచ్చని మీగడల్ మెసవి
కే జవరాలి వరాల బుగ్గలన్
గిచ్చి నవారుణాస్ర మొలి
కించుచు తూరుపులోన—కాగడా
తెచ్చెనో ఆ రకాసి జిగి
దేరిన వెన్నెల జ్వాల లెత్తగా.

## కవీ!

నరకాగ్నిన్ బడి క్రుంగుచున్న నను గం
ధర్వాప్సరః కామినీ
తరుణ స్వాదు నవోపగూహన పథాం
తర్వర్తిగా జేసి దు
ర్భర దారిద్ర్య పిశాచినీ రుధిర ధా
రా క్రూర దంష్ట్రా ప్రఘా
త రిరంసా పరిఖిన్నతన్ మరపు నొం
దన్ జేతువోయీ! కవీ!

# సంధ్యాలయ మూర్తి

లయసంధ్యా శివమూర్తి! హే ప్రళయవే
ళా రుద్రమూర్తీ! భవ
న్నయన జ్వాలలలో జరా మరణ బా
ధా రాక్షసుల్ బూదియై
పయనించున్; నవసాంధ్య పద్మకళికా
ప్రత్యగ్రరాగోదయ
ప్రియ గంగా శివమూర్తి! బ్రోవగను రా
వే చంద్రచూడామణీ!

నాగావళీ దివ్య భోగ రాగమ్ముల
బాహువల్లికలందు బడసినావు;
హాలాహలాయాత కీలావళీ వ్రాత
గళమందు నీలమ్ము కట్టినావు;
భంగ రంగానంగ శృంగార గంగా న
దీ వారి కోశాంబు దింపినావు;
ప్రళయాగ్ని నగ్నధారా శాంతిపూరమ్ము
ఫాలభాగమునందు దాలిచితివి;

రుద్రమూర్తి! భవదతిమ్య రుచ్య దేహ
కాంతిలో అప్సరసలకే కన్ను మిట్టై;
పార్వతీదేవి నీ దివ్య పాదసీమ
తనదు యౌవన మెల్ల అర్పణము చేసె.

కాలికి గజ్జె కట్టికొని
కావిమెరుంగుల సందె గడ్డపై
మేలి గజాజినాంబరము
మేన ధరించి ఆనేకతీర్ల నృ
త్యాలను సేతువంట! తల
యందలి ప్రేయసి నూచుదంట! సం
ధ్యా లయమూర్తి! నాట్యకళ
యందున లోకము మోసపుత్తువే!

నీ నీలాలక బంధ మందలి భవా
నీ గాంగ రంగత్తరం
గానన్ బాల శశాంకమూర్తి అమృతో
స్నానమ్ములన్ జేయు న

య్యా! నీ కింకిణికా కుణుక్కుణు రవం
బాలించి బ్రహ్మాండమే
ఆనందమ్మున నృత్య మాడును మహా
త్మా! నాగభూషా విభో!

నీ సుకుమార పాదముల
నింగి కురంగధరుండు వెన్నెలల్
దోసిట బోసి తెచ్చి అను
రుల్ పులకింపక తాన మాడ్పు ; వి
న్యాస విలాస హాసముల
నాట్యము చేసెడి నీ కరాంగుళీ
ప్రాసములో అనంగుడు జి
రా మరణమ్ములు దక్కి నిక్కెడిన్.

కుడి హస్తమ్మున శూల మెత్తెదవు ది
క్కుల్ పిండిగా ఢక్క చ
ప్పుడు గావింతు మరొక్కహస్తమున ; ని
ప్పుల్ గ్రక్కు నీ కంటిలో
పిడుగుల్ పిల్లలు పెట్టుకొన్నవి ; మహా
మేఘావళీ గర్జనల్
గుడుగుంచమ్ముల నాడుకొన్నవి, శిరః
శ్రీకారి, నీ ఢక్కలో.

# నటస్వామి

చరమగిరి కూట భాగాన తెరచినారు
నాట్య శాలలు ; సంధ్యా పినాకపాణి
గల్లు గల్లున గజ్జెలు కట్టి యాడి
యెల్లలోకాల జోకొట్టి కళ్లుమూయు,

బాల చంద్రుడు శృంగాలు వంచికొనగ
రింగు రింగున గంగమ్మ పొంగిపోవ
నాగసర్పాలు గాలి బోనాలు విడువ
నాట్యమాడెను సంధ్యా పినాకపాణి.

ఖర్వమై పోయె కైలాస-పర్వతాలు ;
మేరుచాపము వంగి కంపింప సాగె ;
పాణినీయాలు డమరు శబ్దాన పలికె
నాట్యమాడగ సంధ్యా పినాకపాణి.

భూత భేతాళ గణములు చేతు లెత్తి
తలలు విరబోసి మృత్యు నృత్యాలు సేసె;
వల్లకాటికి యాత్రకు వెళ్ళుచున్న
యముని కాసర మగ్నిలో యములు తాగె.

శివుని ఫాలాన పెను తారుచిచ్చు లేచి
గగన కబరీ భరమ్మును కప్పుకొనియె;
చెంగు చెంగున నెగయు సారంగ మొకటి
శివ శిరశ్చంద్ర కేదార సీమ దోచె.

సగము దేహాన పర్వతస్వామి పుత్రి
తా లలామము మంగళాంగముల దీర్చ
సగము దేహాన విషనాగ భుగభుగముల
నాకు కనిపించె సంధ్యా పినాకపాణి.

పర్వతాగ్ర శిఖా పరివాహ దాహా
మర్ణవమున చేరునంత వరకె
ప్రణయి జనతా వియోగ తాపమ్ము లెల్ల
నవనవోపగూహనమ్ము వరకె.

బాల చంద్రరేఖ కాలిగోరై తోప
గౌరిపాదాల తల వంచగలిగినాడు
పంచ బాణ బాణ వంచనా లక్షిత
శాల భైరవస్వామి, నాట్యాలరాజు.

# శిల్పి

సాగిల దీసి రాళ్ల నొక
జాలుగ వాగుగ తోగులాగునన్
లాగెద వెట్టు లన్న నటు
లన్ : ప్రియురాలి పయ్యంటలో అనం
తా గుహాలోని స్వప్నములు
దాచిన నీ ఉలిముక్కు లోపలన్
దాగుడు మూతలాడ కవి
తా లలితాంగి రహస్య విహారముల్.

రాలు మలంతు వీ వని వ
రాలను కుప్పలు పోసి రాణివా
సాలకు గొంచుపోయి ఒక
చక్కని జాణను చెక్కుమంచు ర
త్నాల నొసంగినారు నర
నాథులు ; లే జవరాలి మోవి స్తం
భాలకు చెక్కినావు ; ఉలి
పన్నుల నొక్కులు తాకనట్లుగా.

నీ ఉలి చూచి ప్రస్తరము
నీరయి పారును ; వెన్నముద్దపై
చేయిడి యొత్తినట్టుల ; ని
శీథముల౦ దభిసారికా పదా
బ్జాయత రాగరంజిత న
వారుణ కంటకపాళి గూర్చి నే
గేయము వ్రాసినట్లు ; విలి
ఖింతువు లోతగు భావముల్ శిలన్.

నిను గని కొండ లచ్చి రమ
ణీ కుచపాళికలై , కపోల మో
హాన ఫలకమ్ములై , భ్రుకుటు
లై కుటిలాలక జాలమై, సురాం
గన లయి రూపు దిద్దికొన
గా ఉలితో అమృతమ్ము చల్లి జీ
వనములు పోసి పోయెదవు ;
బ్రహ్మవు శిల్పకులావతంసమా !

చెక్కిన రాత్రిలో—మధుర
సీమవు ఒల్కు విపంచికా రవం
బుఱ్ఱ నరాలలో పలుకు
ఒత్తిన రీతి ధ్వనించునంట ! ఏ
లెక్కలతో ఉలిన్ కదిపి
‘ రిం ’ గను చక్కని మ్రోత రాతిలో
గ్రుక్కితి వయ్యా ! శిల్పి కుల
కుంజర ! పుంజిత బ్రహ్మతేజమా !

సుత్తెల మ్రోతతో అలసి
చొక్కిన కొండల పిండు లెల్ల నో
రెత్తి నినాద మిచ్చినవి
“ ఈ వెటువంటి మనోజ్ఞ రూపకం
జెత్తు మటన్న నెత్తెదము ;
ఎందుల కెట్టుల మట్టి మట్టిగా
మొత్తెద వోయి శిల్పి కుల
భూషణ ! శైల శిలా ప్రపేషణా !

# మహా లేఖిని

పద్దెము వ్రాయుచున్ వెనుక
వైపుకు చూడకు లేఖినీ! మహా
పద్ధతి దాపురించును, గ
బ్బా గబ గుంజుము వేనవేలుగా
పద్దెము; లక్షవాదముల
పై కను లుంచకుమా! పదావళుల్
ముద్దులు గార్చుచున్ కినుల
ముందర తాండవ మాచరించెడిన్.

త్వరపడు! భావ సాగరము
బాహువు లెత్తుక నీ శిరస్సుపై
పొరలుచు వచ్చుచున్నది, క
వుంగిలిలో కవితాకుమారి సం
బరపడి నవ్వుచున్నది; గ
బ్బా గబ కూర్చుము పద్యరాశి; అ
ర్థ రహితమంచు పల్కెడి క
ళా రహితున్ పడద్రోసి సాగుమా!

కొండలనుండి జారు నొక
కోమల శైవలినీ ప్రవాహమున్
బండలతోడ కాలువలు
వైచెడిదాక స్రవించ కన్న కూ
ర్చుండుమనె ? మాధు బిందువుల
నొల్కు మధూక సుమాల నొల్లికున్
నిండుగ లొట్లు కట్టెదము
నేలకు జారకు మన్న అగునే ?

నాదొక వెఱ్ఱి : త్రాగుడున
నాడును పీడును అమ్ముకొన్న ఉ
న్మాదివలెన్ కవిత్వమున
నా సకలమ్మును గోలుపోయి రా
త్రీ దివముల్ రచించితిని
తీయని కావ్య రస ప్రపంచముల్ ;
వేదన యేదియో కలత
వెట్టును గుండియ నెందుచేతనో ?

కొండలు కొండలే అడవి
కోనల భగ్గున మండిపోవ నా
గుండెలు గుండెలే అరుణ
గోళములై ప్రళయాగ్నిమాలలై
మండుట చోద్యమా? మధుర
మంజుల మామక లేఖినీ ముఖం
ఎండకు మండిపోయి రచి
యించును గ్రీష్మ మహా ప్రబంధముల్.

నా కఠినీ ముఖాంతరము
నన్ నవలీల విశాల నీరదా
నీకము వచ్చి డాగి దయ
నీయముగా విలపింపగా అసం
ఖ్యాకముగా మదీయ ఖటి
కా లుఠితస్ఫుట పద్యజాలముల్
వాకలు వాకలై అలుగు
వారును గుండెలు పొంగి పోవగా.

సందేళలో, తమో నిబిడ
శాలలలో శివనాట్య మాడి నా
అందెల మ్రోతతో బ్రతుకు
నంతయు సందడిచేసి ప్రేయసీ
సుందర మందహాస పరి
శోభిత మామక మానసాంతరం
బందు రచింతు నీరవ ని
రంత నిశా నిబిడాంధ కావ్యముల్.

పది కావ్యమ్ములపాటు ప్రేమమయ ది
వ్య స్వాంతగీతాలు వ్రా
సెద; కాంతాధర కంపిత ప్రవచన
శ్రీలే ఉటంకించెదన్:
పదియార్వన్నెల చందమామ కను స
న్నన్ చుక్క చెక్కిళ్ళపై
వెదజల్లించెద మామకీన కవితా
పీయూష ధారావళుల్.

# త్రిపామయీ!

ఊర్వశీ స్నిగ్ధ సౌందర్య మురికి వచ్చు
మొగము చిట్లించి వణకెదు మోవినుంచి
అమృత పాత్రిక భయమున నంటిపట్టి
త్రావెదేల! ప్రేమమ్మును దాచెదేల!

తలపు కలదు; ఆ తలంపులో వలపు కలదు;
దానితో యౌవనంపు తొందరయు కలదు;
తొందరకు తోడు నేను నీ ముందు కలను:
దాచెదేల! ప్రేమమ్మును దాచెదేల!

ప్రాణమే లేని పాషాణ ప్రతిమలైన
ప్రేమ నెరుగనివారు దూరెవరో నిన్ను!
వెకిలిగా, నిన్ను చూచి, నవ్వుకొనువారో!
వెరచి వారికి, నిను దాచి పెట్టెదేల!

సందెలలో, తమో నిబిడ
శాలలలో శివనాట్య మాడి నా
అందెల మ్రోతతో బ్రతుకు
నంతయు సందడిచేసి ప్రేయసీ
సుందర మందహాస పరి
శోభిత మామక మానసాంతరం
బందు రచింతు నీరవ ని
రంత నిశా నిబిడాంధ కావ్యముల్.

పది కావ్యమ్ములపాటు ప్రేమమయ ది
వ్య స్వాంతగీతాలు వ్రా
సెద; కాంతాధర కంపిత ప్రవచన
శ్రీలే ఉటంకించెదన్:
పదియార్వన్నెల చందమామ కను స
న్నన్ చుక్కల చెక్కిళ్ళపై
వెదజల్లించెద మామకీన కవితా
పీయూష ధారావళుల్.

# తపోమయా!

ఊర్వశీ స్నిగ్ధ సౌందర్య ముబికి వచ్చు
మొగము చిట్లించి వణకెడు మోవినుంచి
అమృత పాత్రిక భయమున నంటిపట్టి
త్రావవేల! ప్రేమమ్మును దాచనేల!

•

తలపు కలదు; ఆ తలంపులో వలపు కలదు;
దానితో యౌవనంపు తొందరయు కలదు;
తొందరగను తోడు నేను నీ ముందు కలను:
దాచనేల! ప్రేమమ్మును దాచనేల!

ప్రాణమే లేని పాషాణ ప్రతిమ లైన
ప్రేమ నెరుగనివారు దూరెదరుగా నిన్ను!
వెకిలిగా, నిన్ను చూచి, నవ్వుకొనువారో!
వెరచి వారికి, నిను దాచి పెట్టనేల!

చాటు చాటుగనే కన్ను గీటెదేల!
సహజమగు ప్రేమ, లేనట్లు చాటెదేల!

నీవు పేదల రక్తమ్ము ద్రావ లేదు;
నీవు హింసాక్రతువు లేవి నెరపలేదు;
ఏల పశ్చాత్తపించెద విటుల్ల? నిండు
చెమటలో స్నానమాడెదు చింతతోడ?

మందిరాంతర పూజా సమాధి వసులు,
రమ్య శుద్ధాంత కాంతా విరాజమాను
లనుగమింపని రీతి నీయందు కలదు,
ఏల అరచేతిలో మోము వాలిచెదవు?

వన్నె బెట్టగ చిరుసిగ్గు చిన్నె కలదు,
గాయమును మాన్పు హృదయాన, కరుణ కలదు;

పాడుఁకొన ప్రేమగీతాలు గూడ కలవు
పెదవి పరదాలలో వాని నదిమె దేల ?
దాచె దేల ! ప్రేమమ్మును దాచె దేల !

రమ్ము ! జాగు సేయఁగ సమయమ్ము లేదు !
మహిని కల వెన్నొ ; ఒక్క ప్రేమమ్మె కాదు !
ఆత్మవిశ్రాంతి కిది యొక ఆశ్రయమ్ము
భయము భయమున తెరతీసి వచ్చుదేల ?
దాచె దేల! ప్రేమమ్మును దాచె దేల ?

[ఒక ఉరుదూ గేయానికి అనుసృతి]

# ప్రభూ!

నా బంధమ్ములు విచ్ఛిపోయినవి; చిం
తాకంత సంతాప చిం
తా బాంధవ్యము నాకు లేదు; ఋణ సాం
తం బెత్తి చెల్లించితిన్:
నే బోరాని ప్రదేశమం చొకటి లే
నే లేదు: రక్తాబ్జ మా
లాబద్ధాభ్యుదయోత్సవ ప్రథమ సం
ధ్యా వీథులన్ బోయెదన్.

*

అంతయె ఇంతో నీ పలుకు
లర్థ మగున్; నిను గూర్చి కూయు వే
దాంతుల కూత లొక్కటియు
నర్థము కావు; గ్రహించినాడ వ్యో
మాంతర తారకా మధుర
హాసములో ధ్వని; చెట్టుచేమలన్
గంతులు వేయు మూగి నుడి
కారము - తీరని విశ్రమింపులన్.

[రవీంద్రుడు]

అగ్నిధార

# రారమ్ము!

మనసు క్రోధాన బండవారినపు డెల్ల
కనికరపు వాన జల్లుతో కదలి రమ్ము!
స్వాంతమందు కారుణ్యంబు సడలు నెడల
అమరగానముతోడ నన్నరసి పొమ్ము!

దేశ సేవా మహామోఘ దీక్షలోన
అలసి, సొలసి; అశాంతితో కలత జెంది
పెను చిరాకున గాభరా గొనెడు వేళ
రమ్ము విశ్రాంతితోడ, శాంతమ్ముతోడ!

ముగుద బిచ్చపుకుడ ఇల్లు మూతవైచి
ముసుగు సవరించి మూలన మూల్గునపుడు
నా మహారాజ! రాజమానప్రభావ!
తలుపులు తొలంగద్రోసి తొందరగ రమ్ము!

కోరికలు నా మనస్సును గ్రుడ్డి జేసి
దుమ్ము పైబోసి నేలకు ద్రోయునపుడు
నా ప్రణయమూర్తి! అంబువాహ ప్రకీర్తి!!
మెరపుతోడ, ఉరుముతోడ, తరలి రమ్ము!

[ రవీంద్రుడు ]

# శ్రీమతి

[ రవీంద్రుని "Fruit Gathering" నుండి అనువాదము.]

వచ్చ బంగారు వెలుగులు పరచి పరచి
శారద దినాంతలక్ష్మి ముచ్చటలు సేయ
బుద్ధ భగవాను నాలయమున జనంబు
సభయ పూజాంజలులొసంగ సమయమయ్యె.

బిందుసార మహారాజు పెద్దకాల
మవని పాలించి దివి కేగె నంతనుండి
రాజ మహిళలు పోవరు రోజు రోజు
బుద్ధమూర్తికి మలుసంజ పూజ సేయ.

ఆలయమునందు దివ్వె వెలుం
గందుట తప్పనె బిందుసార భూ
పాల కుమారు డప్పటి నృ
పాలుడు ; బౌద్ధ మహాప్రబంధముల్

గాలిచివైచె ; నెత్తుటిక
లమ్మున పైతృక శాసనావళిన్
వాలుపు గీతలన్ కరకు
వారిన చేతల కొట్టివైచెనున్.

మానసమందు భక్తి ఘన
మై తగ పుణ్యనదీ జలమ్ములన్
స్నానము చేసి రాణి పరి
చారిక 'శ్రీమతి' ఫుల్లమల్లికా
సూన మనోజ్ఞమాలికలు
చుక్కలవోని ప్రదీప కోరక
శ్రేణులు పైడి పళ్ళెమున
జేర్చి రాణిని చూడ వచ్చెనున్.

"బుద్ధ దేవాలయమునకు పూజ సేయ
పోవువారికి మరణశిక్షా విధంబు
వినుమి రాజాజ్ఞ యిది" యని వినిచె, మేను
జలదరింపగ శ్రీమతీ సతికి రాణి.

రాణికి నమస్సు చేసి పారాణి చెడని
క్రొత్త పెండ్లికూతురు రాచకొమరు భార్య
'అమిత' యుండెడి సౌధాన కరుగుదెంచె
శ్రీమతి, ప్రబుద్ధ భక్తిమచ్ఛ్రీమతి యయి.

తొడవయి జాళువా మెరుగు
తొన్కెడి అద్దము నుంచి, చొళ్ళెపున్
ముడి విడవైచి పాపటను
ముక్కున నూటిగ తీసి కస్తురీ
తిలకము భాగ్య చిహ్న మటు
దిద్ది మొగమ్మున, నవ్వుచున్న అ
ప్పుడు 'చమితాలతాంగి' భయ
పడ్డది శ్రీమతి జూచి నంతనే.

"కత్తి మెడపైకి తెచ్చితి కాదె! ఏమి
ఈ భయంకర బుద్ధపూజా భరంబు!"
అను చమితభీతి 'అమిత' వాకొనుట చూచి
శ్రీమతి చనె శుక్లాకుమారికను చూడ.

కిటికి చెంత దినాంత శాంత రవి రుక్
కిర్మీర కాంతిన్ పుటం
బుట శృంగారపు కావ్యమున్ చదువుచున్
మోహావమగ్నాంతరో
త్కట తాపోచ్ఛ్వసనమ్ములన్ వెలుగు శు
క్లాదేవి భీతిల్లి వా
కిట పూజాతుర శ్రీమతిన్ గనుటనే
కేల్జారె కావ్యమ్మునన్.

"ఓసి ! ఇది యేమొ ? యౌవనాభ్యుదయమైన
నీ వయసు మిత్తి కాహుతి కావలసెనె ?"
అనుచు శుక్లాకుమారిక గొణుగుట విని
విసిగి శ్రీమతి రాణుల విడచి పోయె.

"రాజ మహిళా లలామలు, పూజ సేయ
మోజు కలదేని లెండు, నోము కొని రండు
బౌద్ధ దేవాలయమునకు వచ్చి పొండు"
అనుచు శ్రీమతి యెలుగెత్తి అరచుచేగ :

కొందరు నవ్వినారు గృహ
కుడ్యముపై పయిఁనుండి తొంగుచున్
కొందరు గేలి చప్పటలు
కొట్టుచు మూసిరి తల్పురెక్కలన్ ;
చందనమున్ సుమమ్ములను
చక్కని చుక్కలవోని దీపికల్
తొందరసేయ ఆలయము
త్రోవన శ్రీమతి పోవ సాగినన్.

రాజ శుద్ధాంత గోపు రాగ్రాన అపర
భాస్కరుని తుది కిరణమ్ము వాడిపోయె ;
వాడ వాడల నీడలు ప్రాకి పోయె ;
అపర సంధ్యా మహాపూజ కయ్యె సమయ
మనగ జేగంట మ్రోగె శివాలయాన :

*

సమసె కోలాహలమ్ము నిశ్శబ్దమందు.

*

శారద రాత్రి నిమ్న హ్రద
సన్నిభమై కనుపట్టె; వెల్గులన్
తారలు తేరి చూచె విను
దారుల; బుద్ధ నికేతనమ్మునన్
బారులు దీరి దివ్వె లగు
పట్టను చీకటిలోన; రాడ్భటుల్
పారుచు బోయి రుక్కు కర
వాలము లొక్కతరిన్ తళుక్కనన్.

"మృతికి జడియనిదాన వెవ్వతెవె నీవు ?"
అని అరచినారు భటులు—తీయని స్వనంబు
"శ్రీమతిని, బుద్ధదేవాశ్రితా మృతాంత
రాత్మ దీపికాకుమారిక"ననుచు విరిచె.

*

ఎఱ్ఱవారెను శ్రీమతీ హృదయ రుధిర
సిక్త ధవళస్ఫటిక శిలాసీమ: మలిగి
పోయె నిశ్శబ్ద తారకాచ్ఛాయలందు
దివ్య బుద్ధాంత్య పూజా ప్రదీప కళిక.

# క్షమామూర్తి!

హిమగిరి శిఖాముఖాన వెల్గించినావు
దివ్య దీపాంకురము ; దేశ దేశములకు
యుగ యుగమ్ముల చీకటు లుడిగిపోవ
గుండెలోనుండి నెత్తురుల్ పిండి పోసి.

నలుబది కోట్ల భారత జ
నమ్ముల వందలయేండ్ల బంధన
మ్ములు సడలించినావు, జయ
ముల్ గొనినావు, త్రివర్ణకాంతులన్
తళతళ లాడు భారత ప
తాకము నాకము తాకునంత యె
త్తుల కెగయించినావు; పగ
తుర్ కొనియాడగ పెంచినాడవున్.

మతముల గ్రుద్దులాటలను
మాన్పు ప్రతిజ్ఞలతో ప్రజా సమై
క్యతకయి ప్రాణ మొడ్డిన మ
హాత్ముడ వీవు ; భవిష్యకాల సం
తతు లఖిల ప్రపంచ జన
తా నయనాంచలవీధి నీ మహా
స్మిత దరహాసమూర్తి పయ
న మ్మెనరింప దృశించ జాలరే !

కాలసవిత్రి వందల యు
గమ్ముల భీషణ గర్భవేదన
జ్వాలలలో సుఖప్రసవ
సౌఖ్యము నందెను నీవు భూమిపై

కాలిడగాని – భారత జ

గజ్జనసీ నయనాల నెత్తురుల్

జాలయిపారె నీవు దివి

షత్పుర మార్గములందు కాలిడన్.

పల్లెల గొల్లవాడవయి

పాలు భుజింతువు; ధోతిగుడ్డ మో

కాళ్ళను దాటనీయ, వాక

కట్టను చేతికి నూతజేసి ఊ

ళ్ళూళ్ళకు శాంతికుంభము శి

రోపరిభాగమునే అహింసయన్

చల్లల నమ్మబోయెదవు,

స్వామి! నరాకృతి సత్యదైవమా!

నీల నీలాకాశ ఫాలభాగమునుండి
రవిబింబ కుంకుమచ్ఛవులు రాలె
భూదేవతా రమ్య పాద మంజీర శిం
జా గుంజనమ్ము లశ్రావ్య మయ్యె
స్వాతంత్ర్యకన్యా నవన్నవ వైవాహ
వేదిపై వైధవ్య నాద మలరె
లోకకంటక జనానీక ఘూక వికార
హేళనధ్వనులు విన్పింపసాగె

చేతులారగ నీవు పెంచిన స్వతంత్ర
నాగవల్లికయే విషనాగ మయ్యె
నీ గళము చుట్టి ప్రాణాలు లాగివేసె ;
భారతీయుల గౌరవ ప్రతిభ మాసె.

# రైతు

పంట పొలాలలోన తెల
వారులు నిద్దుర కాచి వేకువన్
ఇంటికి వచ్చి చద్ది మెతు
కెంగిలి చేసియు చేయకో పసుల్
వెంటబడంగ కాననము
వీధుల బోయెడి కాపుబిడ్డ! నీ
వంటి స్వయంప్రపోషణ వి
భావము రాజుల కబ్బజాలునే!

ఎన్ని పుణ్యాలు చేసి జన్మించినావో!
ఈ ధరాభామినీ మధురాధరాన
అమృత మొలికించినావు నీ హాలముతోడ
హాలికా! వేనవేల దండాలు నీకు.

# కాలపు కంటిలో

కాలపు కంటిలో కరకు
కత్తులు గ్రుచ్చి, మెరుంగు నెత్తురుల్
కాలువ కట్టి తెచ్చి, ధన
కాళికకున్ బలి యిచ్చి, మెచ్చి కా
లాలు వరమ్ము లందెదరు
రా ? నిరుపేదల బూదిమోమునన్
దాలిచి భక్తియుక్తుల స
దాశివు నేన్ బులిపించ నెంచుచున్ ?

# కిరణాగ్రము

ఎందుకు పాడినావు పుల
కింపని నా హృదయంపుటంగణం
బందున వేణుగీతములు ?
హారతు లెందుల కెత్తినావు ? నీ
డెందమె కప్పురంపు పొగ
లేపి దిశావలయాంబలోని దు
ర్గంధము వాపుచుండ ! కవి
రాజ ! దరిద్రపిశాచినీ ప్రభో !

ఈ చీకటను[illegible]టి దాటి యెవడో
యేమో ! ప్రభా భాండముల్
ప్రాచీ ప్రాంగణమందు చానపులు చ
ల్లన్ తెచ్చుచున్నాడు : తా

రా చౌర్య మ్మొనరించినాడు : రజత
ప్రాకారముల్ కూల్చి నా
లో చొక్కంపు పసిండి సౌధముల బా
రుల్ తీర్చ నున్నాడు రా !

బండవారిన నీళ్లు కూర్చుండి కదల
వీ హిమాచల శిఖర సందోహ మందు ;
నీల శిలల ప్రాకారంపు నెర్రెలందు
నుండి బాలార్క కిరణమ్ము లురికి రావా ?

# అస్తమయంలో

నేను పడమరలోకి చూస్తాను — రోజు
కుంగిపోతున్న సూర్యుని గుండెలోని
వెలుతురులు తాగి, చీకటికలలు లాగి
రాత్రి సొంతము నిద్దుర రాదు — రోజు.

ఈ నిశా ప్రాంగణాన అద్దించినారు
పాడు నెత్తురు రంగు, దేవతల స్త్రీలు ;
వాళ్ల కను కోనలందు నీవాళ్ళు లెత్తి .
వెళ్ళిపోతాడు సూరీడు, పిల్లవాడు.

ఒకటి తరువాత వొక దినమ్ము కదలాడి
ఓడి పోతోంది నాముందు : పాడువడిన
పాత కాలము, రామన్న త్రేత కాల
మునకు నెత్తురు రంగు చందనము రాయు.

పూట పూటకు బుక్కెడు కూటికొరకు
పాటుపడు పేదవాని ఆరాటమందు
రాజభవనాలు , మన్మథరాజ రాజ
చారు శృంగారకథలు, కంగారు పడును.

నేను వ్రాసిన మాత్రాన వానకారు
రాక పోదు తుఫానులు లేకపోదు;
నేను వ్రాయని మాత్రాన కానరాక
పోదు అస్తమయాన సూర్యోదయమ్ము.

నెత్తురులు పోసి పంటచేలు నింపవచ్చు
నెత్తురులు పిండి అసువు పోసొత్తవచ్చు
లయ మహా శ్మశాన వీథి యాత్రమ్మునందు
సృష్టి సుందరదేవి కన్పింపవచ్చు.

# హిమజ్వాల

మాపు సొంతము కురిసిన మంచుకోన
రేపు సొంతము మంటలు రేగునంట!
కప్పుకొన దుప్పటీ లేని కవి కలాన
గప్పు మని నిప్పుమంటలు క్రమ్మునంట!

ఏ మహామహుడో ప్రజాహితము కోరి
మున్ను చనిపోయె; నాతని మూర్తి చూపి
మా ప్రజల ఆకళులు మాన్పుమాట కల్ల;
మంచులో అగ్నిశిఖ మాటు మణగబోము,

ఏవ రెరుగు పరిణామమో ఈ జగత్తు
ప్రాణ మని ? ఎవ్వ డెరుగు నిష్ప్రాణ మైన
పాతకాలంపు రాతి స్తంభాల నీడ
కోటి రాచరికాలు దిక్కు- దెస లేవు !

నా నవులలోన రుధిర హీనా కఠోర
ఘోర ఝుంకార మేల దాగుకొన జూచె
నో ! నిశా హిమానీ తరుణీ నితంబ
లంబివేణిక నగ్నిపుష్పంబు లేలనో !

# ఉస్సురనెదవు?

ఓసి కూలిదానా ! అరుణోదయాన
సాంతి తట్ట నెత్తిన పెట్టి మరుగులేని
యెత్తు రొమ్ములను పొంగించి యెందుకొరకు
ఉస్సురనెదవు ? ఆకాశ మునికిపోవ.

అంబర చుంబి సౌధముల
కాయువు పోసెడి నీ శ్రమ ప్రభా
వంబు నైరంగలేని ధన
వంతుల బంగరు పళ్ళెరాలలో
ఱంబలి పోసి త్రావు సమ
యంబులు దగ్గరె లెమ్మ ! నీ నవా
స్యంబున రుద్రనేత్ర విల
యాగ్నుల కుంకుమబొట్టు పెట్టుమా !

వ్రాసివ్రాసి పాత్రోద్యమ్ములు మాసి నా క
లమ్ములో సిరా యింకి, గళమ్ము పాసి
ఆగణా తరుణాశ్వగాల పద్యాలు చేసి
ఆకలికి మాడిపోయెద నీకొరకయి.

# మళ్ళించు, రథము

ఓ నిరుపాధిజీవి ! ఎవు
డో నశియించునురా ప్రశాంతి : ఈ
శానుని కంటిలో దశది
శల్ మసియైనవి, నీ క్షుధార్త గ
ర్భాన దవానలమ్ము జఠ
రానల మగ్గల మయ్యె ; నెన్నినా
ళ్ళీ నరకాన క్రుంగెదవు,
లెమ్ము, సమాజము మార్చివేయగా,

ఈ సమాజాన దోపిడికే నివాస,
మిందు నీకేమి లేదు; సహింపరాని
వేదనయె కాని వేరు కన్పింపబోదు.
లే, చివాలున లేచి మళ్ళించు రథము,

ఈ ఉరిత్రాళ్ళలో బ్రతుకు
నీల్గి శవాలయి వ్రేలుచున్నాడె ; ఏ
దో ఒక బొందలోన పడ
నున్నది ఈ జగదీరథమ్ము ; లె
మ్మా ! ఆదు సెక్కి వచ్చు కోటి
లాధ్వము లందున నుండి త్రిప్పి వా
శ్రేయ పథాలలోన కద
లింపుము లోక రథోరు చక్రముల్.

నీ నిరుపేద గుండె కరు
ణించి ఘృణించి యుగాలనుండి ల
క్ష్మీనిలయాలలోన నివ
సించు కుబేరుల కెగ్గు సేయగా
బూనగ లేదు, నీ బ్రతుకు
మూల్గులు పీల్చినగూడ నుంత కో
పానకు తావొసంగదు, కృ
పామతి ! యెంతటి ఓర్పుకాడవో !

నివే లోకమును నిండ నింపితివి కా
న్తి; ఈ ప్రభుత్వాలు ని
న్నే వంచింప బలాలు కూర్చుకొనుచుం
డెన్; భగ్నజీవి, తుపా
ను వర్షించెడి ఉక్కుగుండ్లు భావ ద
గ్ధ స్ఫార నేత్రాలలో
త్రోవల్ చేసుక సాగలేక పరువె
త్తున్ వెన్కకున్ వెన్కకున్.

నీ నయనాశ్రు శీతల ధు
నీ పరివాహము భీకరాస్త్ర శ
స్త్రానల కీలలన్ గుటుకు
మన్నది; తిన్నగ మ్రింగివేసి నీ
లోననె దాచుకొన్న; దెవు
డో శివనేత్రము పోలె విచ్చి లో
కాన లయాగ్ని కీలికలు
కప్పునురా! వినరా! కృశోదరా!

# ఇందుపుర దుర్గం

[ నిజామాబాదు సెంట్రల్ జైలు ]

ఇది చరిత్రాత్మకం బయిన
ఏ మహాదాలయమో ! ఇ దే మహా
కదనము కోసమై మలచి
కట్టిన దుర్గమొ ! భారతీయ సం
పదలను కొల్లగొట్టిన న
వాబుల గూబలు గుఁయ్యనన్, బదా
బద లయి పోన్ మరాటి భట
వర్గము లొత్తిన శంఖపుంఖమో !

ఇచట శివాజి వాజి యొన
రించిన హేషలు నేటికిన్ గుహా
నిచయములందు గాలి పయి
నించుటతో వినిపించు ; వేదని

ర్వచనముఁ జేసినారలు, ధ
రాసురవర్గము రాఘవాలయ
ప్రచుర తరాంగణమ్ముల వి
పంచిక మ్రోసిరి సామగానమున్.

నశియించెన్ రఘునాథయోధుని దివా
ణమ్ముల్ ; మహారాష్ట్ర వీ
రశివాజీ గురు రామదాస రసనా
గ్రవ్యగ్ర మంత్రౌఘముల్ ;
నశియించెన్ రఘురామ దేవళము లీ
నా డీ నిజాం రాక్షసీ
నిశితాసిన్ బడి బందిఖాన యయి క
న్పించెన్ వికారమ్ముగా.

ఒక కాలమ్మున ఇద్ది దేవళము ; వే
రొక్కప్డు దుర్గంబు ; నే
డకటా! జైలయి కానుపించెను ; భవి
ష్యత్కాలమం దెట్టిదో

పకమున్ దాల్చునా! కాలచక్రగమన
స్వాభావికావర్తక
ల్పకమై దేవళ్ళ పఠాను దుర్గమగు నీ
బందీలై పాలింపగన్.

ఇట మరాటీ జోదు పట పట కొరికిన
పండ్లతో గోల్కొండ గుండ్లు నలిగె ;
ఇట మరాటీ జోదు చిటిక వేయుటలోనె
ఔరంగజేబు కంగారు పడెను ;
ఇట మరాటీ జోదు కటి బిగించుటలోనె
గగన భూ మార్గాలు కట్టువడియె ;
ఇట మరాటీ జోదు గుటక మ్రింగుటలోనె
తురక భూపతుల నెత్తురులు తరిగె

ఇట మరాటీలు స్వాతంత్ర్య పటహములను
మ్రోసినారలు ; రాజ్యాలు చేసినారు
ఇట స్వతంత్ర్య పతాకాల నెత్తినారు ;
కత్తి మొనతో దురాత్ముల మొత్తినారు.

ఢిల్లీలో భరతాంబ చేతులకు బే
డీల్ వేసి బంధించి లాల్
ఖిల్లా పై విషదంష్ట్రిబోల్ శిశ కళల్
గీలించు జండా' పటం
బల్లల్లాడ ప్రభుత్వమున్ జరుఫు నా
డౌరంగజీబుండు నీ
ఖిల్లామీది శివాజి కేతనము లా
గింపంగ లేడయ్యె బో.

అల వింధ్యాచల సీమలన్ రణము సే
యన్ బోయియున్నట్టి వీ
రుల గుఱ్ఱమ్ములు దప్పి దీర్పుటకు రా
త్రుల్ రాత్రులే వచ్చి జీ
నుల తోనే రఘునాధసాగరమునన్
తోయమ్ములన్ ద్రావి పి
ట్టల వోలెన్ రణమందు దూకెను, మరా
టా గుఱ్ఱముల్ గుర్రముల్

ఆత డొక బ్రహ్మచారి, పర
మాత్మకు నాత్మకు నైక్యతా వియో
గతలను గూర్చి చర్చలకు
కాలము పుచ్చెడివాడు ; భారతీ
యత కపకారమున్ జరుగు
నప్పుడు ఖడ్గము బూని మ్లేచ్ఛులన్
మెతిపె మహోమహుం డతని
నే రఘునాథు డటందు) లోకులున్.

అమితోత్సాహమునన్ పురాతన చరి
త్రాంకమ్ములన్ జూడ వ
శ్చిమ చాళుక్య మహేంద్ర తేజము విశా
సించెన్ ప్రభాతారుణా
ర్యమ డవ్యద్యుతివోలె : ఇందుపుర దు
ర్గద్వార తీరాల అం
ధ్ర మహారాష్ట్ర నృపాలు రెత్తి రసిధా
రాపూర మిచ్చోటనే.

# వీరాంధ్రుడా!

పటు బాహాబలులైన ఆంధ్రుల గత
ప్రాశస్త్యముల్ వల్లె వే
యుటలో కొన్ని తరాలు దాటినవి ; పూ
ర్వోద్దంతముల్ నేటి సం
కటముల్ తీర్పవుగాక, నాటి జ్వలితాం
గారమ్ము లీనాటి కుం
పటిలో బూడిద కప్పుకొన్నవి, రగు
ల్పన్ లెమ్ము వీరాంధ్రుడా!

ముక్కలు ముక్కలై చెదరి
పోయెనురా! మనజాతి ; హూణభూ
భుక్కుల రాజనీతికి క
వుంగిళు లొడ్డిన 'రాజు' చేతిలో
చిక్కెను కోటిమంది నివ
సించెడి బంగరు తెల్గునేల నే;
డక్కడ తెల్గుటంగనల
ప్రాణము, మానము దక్కకుండెడిన్.

నాటి మహాంధ్రరాట్ కరక
నత్ కరవాల కరాళధార ఈ
నాటికి తెల్గువాని నయ
నమ్ముల లెక్కలు పెట్టుచున్న దా
రాటము పెంచుచున్నది, ప
రాజితమైన తెలుంగునేల పో
రాటమునందు గెల్చికొని
ప్రాజ్య మహావిభవమ్ము లందగన్.

ఎత్తిన కత్తి దింపక జ
యేందిర నందిన పూర్వ లాంధ్రరా
జొత్తుల నెత్తురుల్ మసలు
చున్నవి తెల్గులగుండెలన్; పరా
యత్త మహాంధ్రి సంపద స్వా
య మొనరింపగ పోరు సల్పగా
వత్తురు స్త్రీలు సైతము, కృ
పాణము కత్తి జయింత్రు శత్రులన్.

తుంగభద్రానదీ భంగమ్ము లిరువాగు
లొరసి పారుచు రుచు లరయునపుడు,
కృష్ణవేణీ తరంగిణి నాలుకలు సాచి
ఇరుకెరంతుల 'మజ్జా' లరయునపుడు,
గోదావరీ వీచికా దివ్యహస్తాలు
దరుల రెండిట మన్ను తరచునపుడు,
మలయాచలాధూత మధు సుగంధిలవాత
పోతమల్ తెలగాణ బొరలునపుడు,

ఇటు విముక్తాంధ్రభూమి తీ పెక్కుచుండ
అటు విషాక్తాంధ్రసీమ చేదై జ్వలించు;
ఇటు తెలుగుజాణ ముక్తి సాహిత్య మూన
అటు తెలంగాణ దాస్య సంకటములోన!

భారతమాత ఈ తెలుగు
పాపని బొజ్జన దాచి కాచి దు
ద్వార మహోగ్ర దాస్య విష
బాధలు తాను భరించి నేడిదే
స్వైరత నందగా, తెలుగు
పాపడు వీడు స్వమాతృ భారతీ
స్వైరపతాక చేత గొన
జెల్లదె ఈ తెలగాణ భూములన్.

# 'ముస్సీ' తటము

అచట ప్రాక్పశ్చిమాకాశ మావలించి
నెత్తురులు కక్కుకొన్నది ; కుత్తుకలకు
కత్తులను కట్టి ఊరేగు కాలరాణి
మాన భంగాల జండాలలో నదించె.

అచట, పాపము, దౌర్జన్య మావరించి
తెలుగుదేశాన నెత్తురుల్ చిలికి వేసె
మత పిశాచము పేదల కుతుక నమిలి
ఉమ్మి వేసెను పిప్పి, లోకమ్ముమీద.

నా తెలంగాణ కోటి రత్నాల వీణ
తీవియలు తెగి, విరిగి నదించకుండె
నా తెలుగుజాణ ప్రాణమానాలు దోచి
ఈ నిజాము పిశాచి కన్నెర్ర చేసె.

నా నరాల నెత్తురు ప్రవాహాన కలిసి
“ముస్సి”లో పారినది ; బుద్ధమూర్తివోలె
మా స్థిరీభూత భావసమాధి వృత్తి
మళ్లి నిలిచిన దినాటికైనగాని.

గెలిచినది గడ్డిపోచ ; మూర్ఖు లయిపోయి
మన్ను కరచెను గొడ్డలి ; కన్నులోని
వేడి అశ్రువు గెలిచెను ; వాడికత్తి
ఓడిపోయెను ; ‘ముస్సి’ పారాడిపోయె.

# అంతర్నాదము

నా గీతావళి ఎంత దూరము ప్రయా
ణం బౌనో : అందాక ఈ
భూగోళమ్మున అగ్గిపెట్టెదను ; ని
ప్పుల్ వోసి హేమంత భా
మా గాంధర్వ వివాహ మాడెదను : ద్యో
మణిశ్లిష్ట గోళమ్ముపై
ప్రాగాకాశ నవారుణాస్ర జలధా
రల్ చల్లి చల్లార్చెదన్.

వీణియ తీగపై, పదును
పెట్టిన నా కరవాలధారతో
గానము నాలపింతు : కవి
కంఠము నుత్తరణం బొనర్చి స్వ
ర్గానకు భూమినుండి రస
గంగలు చిమ్మెద : పీడిత ప్రజా
వాణికి 'మైక్' అమర్చి అథ
వాదులకున్ వినిపింప జేసెదన్.

తీతువ పిట్టనై చని ప
తివ్రిత ఇంట అమంగళ ధ్వనుల్
చేతును : కోకిలా గళము
చించి వసంతము దొంగిలించి వ
ర్షా తరుణమ్ములో జలద
రావముతో శ్రుతి మేళవించి చిం
చా తరుశాంఖిశాంతర ని
శాంతమునందున పాట పాడెదన్.

ఆకసములోని చుక్కల నాదరించి
ఆకలికి యేడ్చు డొక్కల నార్చి పిలిచి
తిరుగబడెదను భూమి బొంగరముమీద
ధగ ధగని మండు లోకబాంధవుని మీద.

ఈ స్మశానవాటి, ఈ నిశానైల్యమ్ము
లీ మహాశిశిరము లెన్నినాళ్లు !
ఈ క్షుధాజ్వరంబు లీ వ్యధాభారంబు
లీ వికారి బ్రతుకు లెన్ని నాళ్లు !!

గదులు గదులయి అరలయి ప్రిదిలి చిదికి
బ్రిదుకు విలువలు నశియించి పాడువడిన
నేటి స్వార్థప్రపంచము నిండ విప్ల
వాగ్నుల తుఫాను లేపి శూన్య మొనరింతు.

హాలహాలమును వడబోసి అమృతధార
తేర్చి త్రాగి త్రేన్చెద : యువతీ కపోల
ఫలకరాగమ్ముపై బాల భానువులను
రంగరించెద ప్రత్యూషారంగమందు.

మానవుల నెత్తురులు త్రాగు మానవులును
దానవులె గాక మానవత్వంబు కలదె ?
దానవుల నంత మొందింప నేను కూడ
రామ కృష్ణావతార ధారణము సేతు,

ప్రాణులను కోట్లు కోట్లుగా వాతగొనెడి
మృత్యువుకు భర్త నేను : బలిష్ఠమైన
నా నరాలతో మృత్యుకన్యకను పిండి
కోట్ల పిల్లల పెట్టించుకొందు నేడు.

భయపడను వానగాలికి, వరదదెబ్బ,
శోకలికి, అశ్రువులకు, త్రేతాగ్నికేని ;
వెలుగు చీకట్లమధ్య తప్పించుకొనుచు
భండన మొనర్చు దివ్యకోదండి నేను.

అగ్నిధార

# కవితా కోపం

పాడను, పాటలు పాడను
వాడను, పదాలు వాడను
వేడను, దేవుళ్ళను
దెయ్యాలను వేడను.

ఓడను, రాజుకు
రారాజుకు
తారా రాజుకు
ఓడను.

గోడను, ధనవంతుల
కనక సౌధ
మున కివతల
వణకే నిరుపేదల
అడుసు
గుడిసె గోడను.

నన్ను చూచి ఎందుకో
మిన్నాగులు ఇట్లా
పారాడుతు జీరాడుతు
వస్తుంటాయి ?

నన్ను చూచి ఎందుకో
పున్నాగులు ఇట్లా
తారాడుతు, గోరాడుతు
పూస్తుంటాయి ?

ఇది లోకం
నరలోకం
నరకంలో లోకం నరలోకం.

ఏనాడో తెలుసు నాకు
ఈ నిరీహ

నీరవ
నిస్స్వార్థ
నిర్ధన
నీచ నీచ మానవులికి
నిలువ నీడ లేదు జగతి
లేదు లేదు విలువ లేదు
రక్తానికి
ప్రాణానికి
శ్రమకూ
సౌజన్యానికీ
రచయితకూ
శ్రామికుని
రమణీ
రమణీయ
మణీ హృదయానికి
విలువ లేదు, విలువ లేదు,

నేనుకూడ వొక గూండానై
గూండానై
పుండువడిన గుండెలతో
మొండివడిన కండలతో
మొండివడిన గుండెలలో
పుండువడిన కండలతో
పుండువడిన గుండెలతో
దౌర్జన్యం చేయాలేమో!
సార్జంట్లనె దోయాలేమో !

ధూర్జటినై
మార్జిన్ వాయాలేమో ! ఈ
ధనార్జనా పర
పరపీడాకర
నిరుదార
నిరంకుశ

నీరస
నిస్తేజ లోకాని
మార్జిన్ వేయాలేమో !

ఫాలనేత్ర విలయాగ్ని
మాలలో
నీలగాత్రి విషనగ్నకీలలో.

# నిరుపేదా!

తరతరాల
దరిద్రాల
బరువులతో
పరువెత్తే
నిరుపేదా !
విరుగుతోంది
 నీ మెడ—
పెరుగుతోంది
నీ గుండెల్లో
 దడ—,

బరువులతో
శిరసు వంచి
పరువెత్తుటె
బ్రతుకని
బ్రహ్మరాత యని
భ్రమ పొందిన
ధోకా చెందిన
నిరుపేదా !
శ్రమ విలువను
గమనించని
అమాయకుడ
అన్నార్తుడ !

నీ ఘర్మంలో
 భర్మం—
 స్వేదంలో
ప్రాసాదం—
 రక్తంలో
 మౌక్తికాలు —
వెలిశాయని
తెలియక

(౯౪)

అగ్నిధార

ఆకలె లోకముగా
శోకమె లోకముగా
మెతుకే బ్రతుకుగా
వెతికే పతితుడ!
బాట తప్పిన
పాంథుడ!
నిన్ను బంధించి
అంధుణ్ణి చే
సింది లోకం.
నీ పిల్లల
నిల్లాలిని
కిల్లిమాదిరి
నమిలే
మిల్లు మ్యాగ్నేట్లు—
నీ వేడి వేడి
నెత్తురుతో
'షవర్ బాత్'
తీసుకునే
భువనైక ప్రభువులు—
వారంతా ప్రభువులు!
అభవులు!!

నిరుపేదా!
నేను కూడ
నీకోసం
ఆకలితో
చచ్చేనా?
నా కలాన్ని
రూకలకై
అమ్ముకొచ్చేనా?
తరతరాల
బరువులతో
విరుచుకపడు
నిరుపేదా!
నిరీక్షించు.
దివ్య దివ్య
భవితవ్యానికి,
నిరీక్షించు.

# శ్రామిక జాతి

తర తరాల
దరిద్రాల
బరువులతో
కరువులతో
క్రుంగి క్రుంగి
కుమిలి కుమిలి
కష్టాలకు నష్టాలకు
ఖైదులకూ
కాల్పులకూ
సహనంతో
శాంతంతో
బలి పశువై
తల వాల్చిన
దీన పరా
ధీన జాతి
శ్రామికజాతి

దెబ్బ తిన్న
బెబ్బులివలె
మేల్కొన్నది
మేల్కొన్నది.

విశ్వ విపణి
వీధుల్లో
చావు చాల
చవకైనది.
బ్రతుకుకు బ్లాక్
మార్కెట్ ధర.
వ్యాపారులు
ప్రపంచాన్ని
తుంచుకోని
పంచుకోని
పరిపాలి

స్తున్నారు.
రైతు కూలి
ప్రజ లంతా
ధనికుల పా
దాల క్రింద
చీమలవలె
చితికినారు.

శ్రమజీవుల
రక్త ధార
జలం కన్న
పలచనైంది
పరతంత్రత
దరిద్రత
గిరులవోలె
పెరిగినాయి.
శాంతానికి
సహనానికి
దహనక్రియ
జరిగింది.

చెలియలి క
ట్టలు దాటిన
ప్రళయ కాల
జలధి వోలె
తిరుగుబాటు
పరచుకుంది.

విశ్వ రుద్ర
ఫాలంలో
విప్లవాక్షి
విరిసింది.
పరతంత్ర
ప్రజాకోటి

ప్రళయవృష్టి
కురిసింది.
స్వాతంత్ర్యో
ద్యమ శంఖం
దిగంతాల
మొరిసింది.
పొగులుతున్న
భూగర్భం—
వగ్గులనున్న
జ్వాలాముఖి—
చిచ్చెంటిన
స్నిగ్ధాటవి—
పిడుగు లురలు
పెను మేఘం—

హర గళ గత
హాలాహలం
శ్రమికజాతి
కదిలింది
ప్రజాద్రోహి
వర్గానికి
లయకాళిక
శ్రమికజాతి—
జగద్విప్ల
వ గళంలో
జయమాలిక
శ్రమికజాతి—
మేల్కొన్నది
మేల్కొన్నది.

# అదుగో!

అదుగో !
అదు గదుగో
ఉదయ దిశా
వదనంలో
కదిలే, మెదిలే
తెల తెల్లని
తళుకులలో—
నిశాంతాన
నశించిన
విశాల తారకామండలం
ప్రశాంత
స్మృతి
సిత
ద్యుతులు !

*

లోకపు
చీకటి చీరకు
ఆకాశం
రైకమీది
చిక్కని
చుక్కల పువ్వులు
తళుకు పెట్టి
గలిగేనా ?
జరీ అంచు
మెరిసేనా ?

దిక్కులేని పేదవాళ్ళ
డొక్కలలో
పిక్కటిల్లు. ఆకలమంటలో
నరనరాల

పరుగెత్తే
మెరుపు తీగె
లదు గదుగో !
 విద్యుద్దీపాల్లో
లండన్, వాషింగ్టన్
నిండు రాజవీధుల్లో
వెండి కరిగిపోస్తున్నై ;
చుక్కలనే
వెక్కిరించివేస్తున్నై.

*

ముజ్జగాలు తిరిగే పేదల
ఎంగిలి మెతుకులు
దొంగిలించి
బంగారం
పొంగించిన ధనికుల
మ్రింగాలని
దొంగచాటుగా కాలం
తొంగి చూచె
నదు గదుగో !

*

మజ్జిగ
పజ్జొన్నకూడు ; కాకుంటే
సజ్జబువ్వకోసరమై
లజ్జ విడిచి,
చిరిగిన చీరెలతో

హిట్లర్, ముసోలినీలు
అట్లే ట్రుమన్ల గొంతులతో
ఓట్లడిగి ప్రభువులై
కోట్లాది పేదల ప్రాణాల్తో
చీట్లాడి ;

మాట్లాడితే, బాయ్
నోట్లు చూపి; ఎన్నాళ్ళు!

అంతరాసియా
గొంతు విచ్చి
పంచానన,
పాంచజన్య
గర్జానిధ్వానం,
చేసిం దదు గదుగో!

విను
అదుగో!

# ప్రాగ్భూమి

పడమటి బొల్లి గద్దలు
పొడిచి పొడిచి తిని విడిచిన
అగ్నిసంస్కారం నోచని
నగ్నశవం ప్రాగ్భూమి.

మతాలతో గతాలతో
చితి రగిల్చి పడి చచ్చే
అన్నాదమ్ముల చల్లని
కన్నతల్లి ప్రాగ్భూమి.

కరువుల తెర చాటున
మరణాంగ నాలింగనంలో
కను మూసిన నిరుపేదల
ప్రణయశాల ప్రాగ్భూమి.

తీగ విడిన దివ్యవీణ
మూగవడిన నాగస్వరం
కదలని వదలని అంతః
కదనపథం ప్రాగ్భూమి.

బూజెక్కిన కీలుబొమ్మ
రాజులపై జాజు బూసి
తాజాగా అమ్మిన అంగడి
బాజారిది ప్రాగ్భూమి.

లక్షలాది పేదల ప్రాణాల్
అక్షింతలుగా చల్లుకొన్న
లక్షాధికార్ల పాలిటి
లక్ష్మీదేవి ప్రాగ్భూమి.

(౧౦౨)

అగ్నిధార

## ఇల

మ్రింగడానికో ఏమో !
నింగికి పొంగుతూ సముద్రం
తొంగి చూస్తోంది నావైపు
దొంగ, వొస్తోంది నావైపు !

ఆకాశం పాతాళం
ఏకోశం తాకకుండ
ఏకాకినిగా భూమి న్నేను
ప్రాకుతున్నాను అయోమయాన్ని !

గాలి కంటె తేలికగా
తేలిపోతున్నా న్నేను
చాలా బరువున్నా నేను !
"గాలి ఈత" ఈత్తున్నాను !!

# ఖేదం

బరువైన వర్షాకాలం
కురిసిన వర్షాలలోటి
కరువులు దిగి వచ్చినవో!
చెరువులు తెగి విచ్చినవో!

నిరుపేదా!
దరి లేదా
నరకానికి ఈ
నరలోకానికి?
వ్రణాలకు
రణాలకు
మరణాలకు
మాన ప్రాణ

కారణాలకు
హద్దూ పద్దూ
వుందని
కరకు తురక
రాజ్యంలో
నిరుపేదా!

చిరఖేదం
విరమించుక
బ్రతికేమా?
కడుపు నిండ
గంజినీళ్ళు
గతికేమా?

(౧౦౪)

అగ్నిధార

సౌఖ్యానికి
సఖ్యానికి
వెతికేమా ?
ఏమో !

పేలిన తారాగోళం
రాలిన కన్నీటిచుక్క
కాలిన ఈ కడుపుఘోష
కూలిన పర్వతశిఖరం—

ఈ వేదన
కుదుటపడుట
జరిగేనా ?
నిరుపేదా !

చిరఖేదాగాధ
మహాంబుధి
విరిసిన
బడబానల
పద్మంలో
వెలిసే
విప్లవబ్రహ్మ
నవజగత్తు
పుట్టిస్తాడో !

భవజగత్తు
గిట్టిస్తాడో !

నిరుపేదా !

# దీపావళి

భూపావళి బుగ్గి చేసి
కోపావళి నగ్గి ద్రోసి
దీపావళి జరపండో
దేశదేశ జనులారా!
తెలంగాణ ఘనుల్లార!!

వ్యక్తులు పరిపాలించే
శక్తి నశించింది నేడు
రక్తంలో అణువణువూ
శక్తి గడించింది నేడు.

చీకటి దయ్యం పోకచే
లోకానికి రాజైతే
ఆకాశం నిలువబోదు!
అర్ధరాత్రి విలువలేదు!!

కోటి కోటి దీపాలను
బాటలలో కోటలలో
నాటండి ప్రజల్లార!
వేటాడండి తమస్సును

కదం వెనక్కు తొక్కించే
ఘనులంతా నడుం విరిగి
కదల్లేక నశించారు.

మనం వెనక్కి నడవం!
జనం వెనక్కి నడవదు
మనం జనం, జనం మనం
జనంలేంది మనం లేము.

చల్లని చమురుంటేనే
జ్వాలావళి, కీలావళి
ప్రజాబలం వుంటేనే
ప్రభుత్వాలు, రాజ్యాలూ.

లోకానికి మూల మూల
ఆకలితో కేక వేయు
నిరుపేదా! జరుపుకోరా
మరో దివ్య దీపావళి.

# ఎవడికెరుక!

ఎవడి కెరుక !
ఆకాశం
అవతల వొక లోకం
లేనే లేదని
ఎవడి కెరుక ! !
ఎవడి కెరుక ! !

ఈ విశ్వంభర
సృష్టించిన
దేవుడు లేనే లేడని
ఎవడి కెరుక ! ! !

వదలని సాయంకాలం
కదలని చేపల గాలం
వొకమై, వర్తమానమై
తల గొరిగిన మంగలికత్తికి
బలమైన నఖ రక్తం నీడలు
తీయని బలిపీఠం
చాచిన నీడలు
ప్రాచీనపు పీడలు
తెల్లదనాన్ని రంగరించిన
నానావర్ణాల కిరణాల
కణాల దినాలు
“ఇంటిగ్రేట్” ఐ
నెత్తురు కక్కి కక్కి
సాయంత్రం దాటి దాటి
ఎండి, అరి, నల్లబారి
రాత్రి? రాత్రి?

నిరాయుధహస్తం కొట్టిన
దెబ్బకు
“బులెట్లు” వెనుతిరిగి పేలి
తుపాకీల కాళ్ళకు ముళ్లై
‘ధాం’ అనవు ‘ధూం’ అనవు.

గతానికి బ్రతుకులేదని
ఆగతానికి మెతుకుందని
మన కెరుకా ?
మహాత్ముల కెరుకా ?
'చర్చి'కి 'ఆర్చి బిషప్పు'కి
రాక్షసుడికి రాజుకి
భూ ఖామందుకి
మిల్ మాగ్నేటుకి
ఇంకా బలం, స్థలం, జలం
వున్నాయని యెవడి కెరుక!!!

ఎవడి కెరుక
అన్యాయం గెలుస్తుందని
ఆకాశం పిలుస్తుందని ?' ?
యెవడి కెరుక
ఈ చుక్కలన్ని, ఆకలి
డొక్క లున్నా యని
ఎవడి కెరుక ? ? ?

నీలాలు తేలిన నింగినిండా
తెల్లుపూచి పాడైపోతుందని
ఎవడి కెరుక ?
కన్నీళ్ళు స్రావరీ పోయెడి
గగనం—(గగనుడు)
నీల నీల మేఘాంగనలను
వదలి — వదలి
శ్వేత శ్వేత చంద్రికా
శుభ్రాంగనలను వరిస్తుందని
—వరిస్తాడని
యెవడి కెరుక ?
నిజానికి 'నిజానికి' బుజం
విరిగిందని యెవడి కెరుక !

(౧౦౮) అగ్నిధార

# ?

ఆ చల్లని సముద్రగర్భం
దాచిన బడబానల మెంతో ?
ఆ నల్లని ఆకాశంలో
కానరాని భానువు లెందరో ?

భూగోళం పుట్టుకకోసం
కూలిన సురగోళా లెన్నో ?
నర మానవరూపం కోసం
జరిగిన పరిణామా లెన్నో ?

ఒక రాజును గెలిపించుటలో
ఒరిగిన నరకంఠా లెన్నో ?
శ్రమజీవుల పచ్చి నెత్తురులు
త్రాగని ధనవంతు లెందరో ?

అన్నార్తులు అనాథ లుండని
ఆ నవయుగ మదెంత దూరమో ?
కరువంటూ కాటక మంటూ
కనుపించని కాలా లెప్పుడో ?

అణగారిన అగ్ని పర్వతం
కని పెంచిన "లావా" యెంతో ?
ఆకలితో చచ్చే పేదల
శోకంలో కోపం యెంతో ?

పసిపాపల నిదుర కనులలో
మెరిసిన భవితవ్యం యెంతో ?
గాయపడిన కవిగుండెల్లో
వ్రాయబడని కావ్యా లెన్నో ?

కుల మతముల సుడిగుండాలకు
బలిగాని పవిత్రు లెందరో ?
భరతావని బలపరాక్రమం
చెర వీడే దిం కెన్నాళ్ళకో ?

# అనంత సంగ్రామం

అనాదిగా సాగుతోంది
అనంత సంగ్రామం
అనాథుడికీ, అగర్భ
శ్రీనాథుడికీ మధ్య.

సేద్యం చేసే రైతుకు
భూమి లేదు, పుట్ట లేదు,
రైతులరక్తం త్రాగే
జమీందార్ల కెస్టేట్లు.

మిల్లు నడిపి, కోట్ల డబ్బు
కొల్లగ లాభం తెచ్చే
కూలోనిది కాదు మిల్లు,
మిల్ మ్యాగ్నెట్ లొకసేటు.

శత్రువులను యుద్ధంలో
చిత్రంగా వధ చేసిన
పేదసైనికునికి 'సున్న'—
రాజ్యమంత రాజులదే.

మధనపడే మేధావులు
శాస్త్రజ్ఞులు, విద్వాంసులు
కనిపెట్టిన అణుశక్తికి
ప్రభుత్వాల కంట్రోళ్లు.

కర్షకులు, కార్మికులు
మధనపడే మేధావులు
తమ శ్రమలకు తగినఫలం
ఇమ్మంటే "తిరుగుబాటు!"

షావుకారు వడ్డీలకు
జమీందార్ల హింసలకు
వేగలేక ఆగలేక
తిరగబడితే "అతివాదం?"

# అనలదాహం

ఎటు చూచిన
చటులానల
పటుదాహం
ప్రబలుతోంది.

మన భారత
జనయిత్రీ
ఘన ఫాలం
జనసామా
న్య నవోజ్జ్వల
చైతన్య
జ్యోతులతో
వెలుగుతోంది
వెలుగుతోంది.

భూత కాల
భేతాళుడు
పాతాళపు
పత్రలలో
ఇరుక్కొని
మరణించెను ;

వర్తమాన
మార్తాండుని
కృధానిదాఘంలో
సామ్రాజ్యపు
సాంద్ర హిమం
రాలి, గాలిలో కలసెను.

నవభారత
యువకులారా !
కవుల్లార !
కథకులార !

భవితవ్యపు
హావనానికి
హోతలు ;
నూతన
భూతల ని
ర్మాతలు మీరే, మీరే

స్వకుక్షింభర
రక్షస్తతి
పక్షాలను
విరగ్గొట్టి
సమిధలుగా
తే లెండోయ్,

సమతా
జమదగ్ని
కుమారులార !
శ్రమజీవుల
సమభావుల
అమృతసిద్ధి
సుముహూర్తా
గమనానికి
అమిత దుఃఖ
సముద్రాలు
మథించండి ;
విశ్రామభోగి
సమూహాల్ని
వధించండి
లే లెండోయ్,
ఎటు చూచిన
చటులానల
పటుదాహం
ప్రబలుతోంది.

(౧౧౩)

అగ్నిధార

# నడిగడ్డ

చుట్టూ సముద్రం పొంగి
నట్ట నడిగడ్డను మ్రింగి
అంతా ఏకం చేస్తుం
దంతా ఒక టౌతుంది.

నడిగడ్డను సముద్రాన
పడకుండా కాపాడే
బడాయి నీ కెందుకు ? రాజా !
లడాయి నీ కెందుకు ?

గుట్టల్ని, పుట్టల్ని మింగుతూ
చుట్టూ సముద్రం పొంగింది
నట్ట నడిగడ్డను కాపాడే
దిట్టరితనం నీలో లేదోయి.

నాలుకలు చాస్తూ సంద్రం
నేలను నాకేస్తున్నది ;
కూలిపోతుంది హిమాచలం
రాలిపోతుంది సూర్యగోళం.

నీ తుపాకి నిప్పులతో
చేతులు కాల్చేసుకోకు
నీళ్ళమీద నిప్పులు పడి
చల్లబడకపోతాయా ?

నడిగడ్డ కడుపులోని
నదులుకూడ అటువైపే
సముద్రాన్ని రమ్మంటూ
సైగలు చేస్తున్నవిరా !

అంతర్బహిశ్చ తత్సర్వం
శత్రువులే నిండినారు
ఇంకేమి బింకంరా ! ఓ
లంకాద్వీపపు రాజా !

ముక్కారెన్నెల రత్నరాశి
రువ్వుతూ అదె వచ్చె నదే
ఉవ్వెత్తున అంభోనిధి!
కెవ్వు మనెను రాజుగుండె.

# పదే పదే అనేస్తా!

ఇదే మాట ఇదే మాట
పదే పదే అనేస్తాను.

ఖడం తొక్కి పదం పాడి
ఇదే మాట అనేస్తాను.

ఎదల్లోన, రొదల్లోన
సొదల్లోన, గదుల్లోన
ఇదే మాట ఇదే మాట
పదే పదే అనేస్తాను.

జగత్తంత రగుల్కొన్న
కృధాజ్వాల వృధాపోదు.

అడుగడుగున యెడద నెత్రు
గడగడ మని త్రాగినావు.

(౧౯౫) అగ్నిధార

పడతుల మానాలు దోచి
గుడగుడ మని 'హుక్కా' తాగి
జడియక కూర్చుండినావు
మడికట్టుక నిలిచినావు.

దగాకోరు బటాచోరు
రజాకారు పోషకుడవు.

వూళ్ళ కూళ్ళ అగ్గి పెట్టి
యిళ్ళన్నీ కొల్లగొట్టి
తల్లి పిల్ల కడుపుకొట్టి
నిక్కిన దుర్మార్గ మంత
నీ బాధ్యత నీ బాధ్యత.

'కోటిన్నర' నోటివెంట
పాటలుగా మాటలుగా
దిగిపొమ్మని దిగిపొమ్మని
ఇదే మాట అనేస్తాను.

వద్దంటే గద్దె యెక్కి
పెద్దరికం చేస్తావా!

మూడుకోట్ల చేతులు నీ
మెడను పడతోస్తాయి
మెడనే విడదీస్తాయి.

నీకు నిలుచు హక్కు లేదు
నీ కింకా దిక్కు లేదు.

చరిత్ర బొంగరం తిరిగి
కిరీటాలు నేల కొరిగి
ధరాధిపులు నశిస్తుంటే
బరాయెనాం నవ్వాబా!
పరాక్రమం చూపేవా?

'దిగి పొమ్మని జగత్తంత
నగారాలు కొడుతున్నది.

'దిగిపోవోయ్ తెగిపోవోయ్
తెగిపోవోయ్ దిగిపోవోయ్"

ఇదే మాట ఇదే మాట
పదే పదే అనేస్తాను.

---